The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు దక్కన్

Golconda Patrika. Hyderabad, Dn.

సంపుటము ౭ | శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ర శ్రావణశు॥ ౪ శనివారము 6-8-32 | సంచిక ౨౭

## ఆంధ్రచారిత్ర పరిశోధక మండలి

### ( ఓరుగల్లు )

అముద్రిత తాళపత్ర గ్రంథసంపాదన

[విద్వాన్ కంభంపాటి అప్పన్న శాస్త్రిగారు]

పై మండలి స్థాపింపఁబడిన పిమ్మట మేము తాళపత్రగ్రంథములను గొన్ని సంపాదించితిమి. వానిలో నీ క్రింది యముద్రిత గ్రంథములు గలవు గోలకొండపత్రికా పాఠకులలో నెవరికైన వీని ప్రత్యంతరము లున్నట్లు తెలిసినయెడల మాకు తెలుపగలరని యుద్దేశ్యముతో, మన యాంధ్రవాఙ్మయ చరిత్రయందే యొకవేళ యే గ్రంథములు వ్రాసినారో వెల్లడింప నుద్దేశ్యముతోను వీనిని గోలకొండపత్రికలో బ్రకటించుచున్నాము.

౧ నలచరిత్ర, ద్విపదకావ్యము- దీనిని వ్రాసిన కవి వెన్నెలకంటి చంద్రశేఖరుఁడు. పాకనాటి వాఁడు. ఇతని యూరుగాను ఓరుగల్లు నివాసియును రామకవి. భార్యపేరు అనంతమ్మ. ఈ గ్రంథము మాకు దొరకినదానినిబట్టి పూర్వభాగము సంపూర్ణముగాను ఉత్తరభాగము అసంపూర్ణముగాను నుండి అచ్చటచ్చట ఖిలములైన ప్రతులు గలదై యున్నదని తెలుపుటకు చింతిల్లుచున్నాము.

౨ ద్విపద గాదపురాణము —— కవి మల్లికార్జున సిద్ధయోగి ఇది సుప్రసిద్ధ చారిత్రక ప్రదేశమగు కొలనుపాకయందు వీరశైవులకును జైనులకును జరిగిన మతయుద్ధమును గురించి తెలుపునది గావున దీని ప్రాముఖ్యతి యెట్టిదియో వివరింప నక్కరలేదు. దీనిని నొకగాయని (కులపెద్ద) యొద్దనుండి యుతగులకు నీయబడినదని తెలిసికొని దానికొక ప్రత్యంతరము వ్రాయించుకొనుచున్నాము. ౩ ఆశ్వాసముల గ్రంథము. ఇంతవరకు మొదటి ఆశ్వాసమును తృతీయాశ్వాసములో చాల భాగమును వ్రాసికొనఁ గలిగితిమి. ఇందులో చెప్పబడిన మతయుద్ధములో వీరశైవులైన గాదులు జాల్లానుట చేతను, కొలనుపాకలో గల మతములలో నొకటగు గాడ మతస్థాపన ప్రశంస యుండుటచేతను నీ గ్రంథము గాదులచే వ్రాయింపఁబడి కాపాడఁబడియున్నది. దీనిప్రతి మఱియొకటి యేగాదులవద్దనైన లభించును గాన అట్టిది సంపాదించి యెవరైన మా మండలికి సమర్పించిన వారియెడ మా మండలి యెంతయు కృతజ్ఞత జూపగలదు.

3 తాళ్లపల్లి రాజగోపాల శతకము ఈ గ్రంథము తాటాకుల గ్రంథము చూచి కొండపల్లి జాగీరదారు లమీనాచే వ్రాసిన ప్రతి దొరికినది. ౧౦౮ పద్యములతోనే సంపూర్ణము అని వ్రాయబడియున్నది. తాటాకులు చాల పురాతన మగుటచే విరిగి ముక్కలైయున్నవి. మధ్య కొన్నిపుటలు పోయినవి. ఈ శతకమునుండి రెండుపద్యములు కీ॥ శే॥ రెంటాల వెంకటసుబ్బారావుగారు తమ శతకసంగ్రహమను గ్రంథములో మచ్చునకు నచ్చువేసి ప్రకటించిరి ఇది సకల మచ్చటనుండియు ముద్రింపబడి ప్రకటింపఁ బడినదా? దీని ప్రతులు ఎక్కడనైన లభించినచో అనుగ్రహముతో పత్రికాపాఠకులు మాకు దెలిపెదరుగాక!

౪ మార్కండేయ వచనములు ద్విపదకావ్యము. నాలుగైదు తాళపత్రములు మాత్రము లభించినవి. పేరందు లేదు.

౫ జానకీపతిశతక - ఇదియు పూర్తిగా దొరకలేదు. ఈ శతకములోని కొన్ని పద్యములు తాపోలు రామదాసుచరిత్రలో నవతాచుచున్నవి ఈ శతకములోని నాలుగైదు పద్యములు కీ॥ శే॥ రెంటాల వెంకటసుబ్బారావుగారి శతక సంగ్రహ

### దేవదాసుగాంధిగారికి జ్వరము

అలహాబాదు, ఆగస్టు ౨:—

శ్రీయుత గాంధిగారి కుమారుడు దేవదాసు గాంధిగారు శరీరాస్వస్థత కారణముగా గోరఖ్పూరు జయిలునుండి విడుదల గావింపబడిరి. వారికిపుడు టైఫాయిడు జ్వరము తిరుగ బెట్టినది.

---

### ఎస్. సత్యమూర్తిగారికి శస్త్ర చికిత్స చేయదలచుట

### అపెండిసిటీసు వలన బాధపడుచుండుట

మదరాసు, ఆగస్టు ౧:—

శ్రీయుత ఎస్. సత్యమూర్తిగారు కొంత కాలమునుండి జనరలు హాస్పిటలులో నున్నారు. వీరికి అపెండిసిటీసు వ్యాధి చాలకాలమునుండి కలదు. వీరు అతిమాత్ర వ్యాధివలనగూడ బాధపడుచున్నారు అని హాస్పిటలులో వీరిని పరీక్ష చేసిన డాక్టరులు నిర్ధారణచేసిరి. అపెండిసిటీసు నిమిత్తము త్వరలోనే శస్త్రచికిత్స జరుగును. వీరిపుడు కఠినపథ్యము చేయుచున్నారు. వీరి శరీర తూకము ౧౩౭ పౌనులు నుండి ౧౧౮ ౧/౨ పౌనులకు తగ్గినది. చాల నీరసముగా నున్నారు.

---

### శ్రీయుత కె. సుబ్రహ్మణ్యంగారు (కడప)

### ఎక్సురేపరీక్ష గావింపబడుట

మద్రాసు, జూలై ౩౧:—

శ్రీయుత కె. సుబ్రహ్మణ్యంగారు (కడప) నిన్నటిదినమున యిచ్చటికి వచ్చి, ఎక్సురే పరీక్ష గావింపబడిరి. సుభాసు చంద్రబోసు గారిని సందర్శించుటకు మద్రాసు పెనిటెన్షియరీ సూపరింటెండెంటు యొక్క అనుమతికోరగా, బోసు గారిని సందర్శించుటకు కలకత్తా సి. ఐ. డి పోలీసు డిప్యూటీ ఇన్స్పెక్టరు జనరలుయొక్క యనుమతి పొందవలెనని జవాబొసగబడెను శ్రీయుత సుబ్రహ్మణ్యం గారిచ్చటనే చికిత్స పొందదలచియున్నారు.

---

### అభయంకరుగారి ఆరోగ్యము

### డాక్టరు ఖేరుగారికి దొరతనమువారనుమతి నియ్యకపోవుట

నాగపూరు, జూలై ౩౦:—

డాక్టరు ఖేరుగారు చెరసాలకువెళ్లి అభయంకరుగారిని పరీక్షింపగోరిరి. కాని యిపుడు ప్రమాదస్థితి యేమియును లేదను కారణమున మధ్యరాష్ట్రముల దొరతనమువారు ఖేరుగారికి అనుమతి నియ్యలేదు.

---

### దాదాభాయి నౌరోజీగారి మనుమరాలికి చెరసాలలో జబ్బుచేయుట

### కుసుమము బెని కన్యగారు యిపుడు వైద్యశాలలో నుండుట

లాహోరు, జూలై ౩౦:—

దాదాభాయి నౌరోజీగారి మనుమరాలగు కన్యాకుసుమము బెనుగారు సత్యాగ్రహమున పాల్గొనందులకు ఆరుమాసములు శిక్షవేయబడెను. లాహోరు చెరసాలలో నామెకు చాల జబ్బుచేసినందున మేయోహాస్పిటలుకు మార్చిరి. ఆమె చాల నీరసస్థితిలో నుండుటచే త్వరగా సంపూర్ణారోగ్యము కలుగజాలదు. ఆమె ఆరోగ్యము పూర్తిగా చెడిపోయినది. కాన ఆమెను వదలివేయదగునని సూచింపబడెను.

### డాక్టరు అలంగారిస్థితి ఆందోళనకరముగా నుండుట

డాక్టరు అలంగారుగూడ మేయో హాస్పిటలులోనే యున్నారు. ఇవటికి వచ్చినపిమ్మట మరల రెండుపౌనులు తగ్గిపోయిరి. ప్రతిదినమును కొద్ది జ్వరముగూడ తగులుచున్నది. డాక్టరులు పరీక్షింపగా ఊపిరితిత్తులు (ప్లిబాసిను) లలో యేర్పడినట్లు కనుబడెను. తగిన శ్రద్ధ చూపనిచో క్షయరోగము క్రింద పరిణమించునని అలంగారి స్వంత డాక్టరుగారు తెలిపిరి.

---

## బొలివియా పెరుగ్వే యుద్ధము

### పెరుగ్వేవారి కోటను బొలివియావారు పట్టుకొనుటయే యుద్ధకారణము

లండను, ఆగస్టు ౧:—

చాకో అడవిలో నున్న పెరుగ్వే దొరతనమువారి తాలూకు బోర్కురను అను పేరు గల మఖ్యతమమగు కోటను బొలివియా దొరతనము వారు పట్టుకొనుటవలన పెరుగ్వేదొరతనమువారు యుద్ధమును ప్రకటించిరి.

బొలివియా వారికి ౩౬,౭౭ మంది సైనికులుగల స్థిరమగుసేన కలదు. ప్రతివత్సరమును సైనికవిద్య నేర్చుకొనుచుండువారు ౮౦౦౦ మంది కలరు. పెరుగ్వేవారికి ౨౫౦౯ మంది సైనికులుగల స్థిరమగు సేనగలదు. ప్రతివత్సరమును సైనిక విద్యను నేర్చుకొనుచుండువారు ౧౦ ౦౦ మంది యుందురు. "రాజు" అని పిలువబడునట్టి సైమను పాటినో అను పేరు గల బొలివియా దేశపు ప్రముఖుడు బొలివియా దొరతనమువారికి ౧౫ యుద్ధ విమానములను పెక్కు లక్షల పౌనుల ధనమును యిచ్చెను.

---

### బొలివియా పెరుగ్వే దేశములకు యుద్ధము

### బొలివియా సేనలు పెరుగ్వేవారి రెండు కోటలను పట్టుకొనుట

లండను, ఆగస్టు ౧:—

"పెరుగ్వే దొరతనమువారి సేనలు రెండుస్థలములలో బొలివియా దొరతనమువారి సేనలను తిలవడినందున బొలివియా సేనలు పెరుగ్వే దొరతనమువారి తాలూకు రెండు కోటలను పట్టుకొనెను." అని బొలివియా దొరతనమువారు ప్రకటించిరి.

"బొలివియా సేన లింకను ముందుకు వచ్చినచో యుద్ధము నిశ్చయము" అని పెరుగ్వే అధ్యక్షుడు గుగ్గియారీగారు ప్రకటించిరని అసనుసియ నుండి తంతివార్త వచ్చినది.

### ఈ యుద్ధము జరుగకుండ జేయగలచుట

ప్రస్తుత మగ్గాను చాకో ప్రాంతమున వేరు సేనలకు మాత్రమే యుద్ధము జరుగుచున్నది గాన యీ యుద్ధము జరుగకుండ చేయుటకు అర్జెంటైనా, బ్రెజిలు చిల్లి దేశములవారు నిశ్చయించిరి. ఇందువలన బొలివియా పెరుగ్వే దేశములవారు తాత్కాలిక యుద్ధమును విరమించుటకు సమ్మతించెదరనియే అందరును తలచుచున్నారు.

---

### లాహోరులో సిక్కు ముసల్మాను విద్వేషము

### నడిరేయి ముగ్గురు పురుషులు, ముగ్గురు స్త్రీలు ఒకశిశువు హత్యగావింపబడుట

ఆదివారము రాత్రి గురుద్వారా బావాలిసాహెబులో సిక్కులు సమావేశమై పంజాబునందు ముసల్మాను రాజ్యము సంగీకరింపమని ప్రతినపట్టుచుండిరి. అదేసమయమున అనతిదూరమున గల మసీదులో ముసల్మానులు సమావేశమై తమ ఆశయముల ప్రకటించుచుండిరి. సిక్కుల సభవలన తమకు శాంతిగలుగకున్నదని ముసల్మానులు రోషపూర్ణులగుచుండిరి. అపుడు ఇరువాగులకును కొట్లాట ప్రారంభమగుచుండెను. ఆ సమయమున టెలిఫోను వార్తవలన పట్టణము మేజస్ట్రేటువచ్చి పోలీసు రక్షణబెట్టి, కలహమును తప్పించెను.

అర్ధరాత్రి మహాళభాగమున ముగ్గురు పురుషులు, ముగ్గురు స్త్రీలు, ౧౮ నెలల శిశువు కొట్లాటలో హతులైరి. ౧౧ ఏండ్ల బాలుడొకడు గాయపడెను. పై జెప్పిన ఏడుగురు తునకలు తునకలుగా ఛేదింపబడిరి. చాలామందిని అరెస్టు చేయబడిరి.

---

### అగ్రవర్ణములు నాగలిపట్టుట

### అలహాబాదు ప్రదర్శనము

అలహాబాదు, అగస్టు ౨:—

బ్రాహ్మణులు క్షత్రియులు నాగలి పట్టరాదను మూఢ నమ్మకమును తొలగించుటకై గ్రామోద్ధరణ ప్రదర్శన సందర్భమున బారారాజాగారు నాగలిని చేతబట్టి కొన్నిగజములు దున్నిరి వారివెనుక నొక బ్రాహ్మణ ప్రముఖుడును అట్లే చేసెను. ప్రజలు హర్షించిరి. రివిన్యూబోర్డు సీనియరు మెంబరు ఓ పెక్ హాముగారును, జిల్లామేజస్ట్రేటు డానల్డుసన్‌గారును ప్రదర్శనమును దర్శించిరి.

---

## కె. భాష్యంగారి విడుదల

### భాష్యంగారు చెన్నపురికి వచ్చుట

మదరాసు, అగష్టు ౧:— శ్రీయుత కె. భాష్యం బి. ఏ. బి. ఎల్. గారిని నేడు ఉదయమున ౬ గంటలకు వేలూరు చెరసాలనుండి వదలిరి. వీరు మోటారు కారులో ఉదయమున ౧౦ గంటలకు మదరాసుకు వచ్చిరి. నేడు హైకోర్టుకు వెళ్లిరి.

---

## అలహాబాదులో పండిత మోతీలాలునెహ్రూగారి శిలావిగ్రహము

### పండిత హృదయనాధ కుంజ్రూగారు బహిరంగ పరచుట

అలహాబాదు, జూలై ౩౦:— అలహాబాదులో హిందువుల భోజన గృహము (హిందూ బోర్డింగు హౌసు) లో బలరాంపూరు హాలులో పండిత మోతీలాలు నెహ్రూగారి శిలా విగ్రహము నెలకొల్పబడెను. నేడు సాయంకాలము పండిత హృదయనాధ కుంజ్రూగారు దానిని బహిరంగపరచిరి. అలహాబాదు న్యాయవాదుల సంఘమువారును మరి పెక్కు మందియును పుష్ప మాలలను తెచ్చి శిలా విగ్రహమునకు వేసిరి. మోతీలాలుగారిని ప్రశంసించుచు కుంజ్రూగారు మాటలాడిరి.

---

## నాగపూరులో రెండుభవనములను దొరతనమువారు వశపరచుకొనుట

### తిలకు విశ్వవిద్యాలయము అసహాయ ఆశ్రమము

నాగపూరు, జూలై ౩౦:— ౧౯౩౨ జనవరిలో నిచటి తిలకు విశ్వవిద్యాలయమును అసహాయాశ్రమమును దొరతనమువారు వశపరచుకొనిరి. వాటిలోని చరాస్తులను వారు వేలము వేసెదరు. ఆభవనములు నిపుడు యజమానులకు వశపరచిరి. తిలకుధ్యాన మందిరముమాత్ర మింకను దొరతనమువారి వశమునందున్నది.

---

## సరిహద్దు జాతులవారిలో యుద్ధము

### డీరు నవాబు క్రొత్తకోటలను కట్టదలచుట

సిమ్లా, జూలై ౩౦:— డీరునవాబు క్రొత్తగా కోటలనుకట్టదలచెను. అందువలన భజవుజాతులవారి కందరికిని ఆందోళనము కలిగినది. అలీనగరు ఫకీరును అలంజెబును కొన్ని నెలలనుండి కుట్రపన్ను చుండిరి. అందువలననిపుడు యుద్ధము ప్రారంభమైనదిగాని నవాబుచాలా ధైర్యముగానే యున్నాడు.

---

## అహమదాబాదు కాంగ్రెసు కార్యాలయమును వశపరుచుకొన జూచుట

### ౫౦ మందిని అరెస్టుచేయుట

అహమదాబాదు, జూలై ౩౦:— కాంగ్రెసు వలంటీరులు నేడు సాయంకాలము మరల కాంగ్రెసు కార్యాలయమును వశపరుచుకొనజూచిరి. ఇదివరకొకసారి వీరుప్రయత్నించిరి. ౫౦ మంది వలంటీరులు నాలుగు జట్లుగా వచ్చిరి. వారినందరిని పోలీసువారు అరెస్టుచేసిరి.

---

## తిరువాన్కూరులో సంస్కరణములు

### ఇషావా సంఘమువారి ఆశయములు

తిరువాన్కూరు ఇషావా రాజకీయ సమితి యాజమాన్యమున క్విలానులో రేపుదయము మహాసభ జరుగనున్నది. «మలయాళరాజ్యం» పత్రికా సంపాదకులు సి. వి. కుంజురామన్ గారు అధ్యక్షత వహింతురు. తొందరలో తిరువాన్కూరున రాజకీయ సంస్కరణములు ప్రవేశపెట్టబడును. రెండు శాసనసభలుండును. వీటిలో తమ సంఘమునకు తగినంత ప్రాతినిధ్య మియ్యవలెనని వీరుకోరిరి. వయసునచ్చినవారికెల్ల వోటు హక్కుండవలెననికూడ ప్రతిపాదించెదరు. తమ ఆశయములను ప్రభుత్వము వారు అంగీకరించినచో శాసన సభలకు బహిష్కరింపవలెనని తీర్మానించెదరు.

---

## అయిర్లండులో ఇండో అయిరిషు లీగు నేర్పరుచుట

### డబ్లినులో భారత అయిర్లండు దేశముల జాతీయవాదుల సమావేశము

### ఆగస్టు నెలలో జరుగనున్న సభకు వి జే. పటేలుగారు మున్నగువారు లండనునుండి వెళ్లదలచుట

ఆగస్టు నెలలో డబ్లినులో భారతీ జాతీయవాదులును అయిర్లండు జాతీయవాదులును కలసి సభను జరిపెదరు. ఆ సభకు లండనునుండి వి. జే. పటేలుగారు మున్నగు భారతీయులు వెళ్లెదరు. బ్రిటిషుసామ్రాజ్యతత్వమును ప్రతిఘటించుటలో అయిర్లండువారికిని యిండియావారికిని ఆశయ సామ్య మేర్పడినందున ఈ విషయమున నీరెండు దేశములకును గాఢమగు సంబంధమును కలిగించుటకు యిర్లండులో నిదివరకే «ఇండో-అయిరిషు ఇండిపెండెంటు లీగు» అను పేరతో నొక సంఘ మేర్పరుపబడెను. ఆ సంఘమువారే యిపుడీ జాతీయవాదుల సభ నేర్పాటుచేసిరి.

---

## బి. తరగతి ఖైదీల మార్పు

మదరాసు ఆగస్టు 1:— టి. సూర్యప్రకాశరావుగారు మరి ఐదుగురు బి తరగతి ఖైదీలు రాజమండ్రి జెయిలునుండి నేడుదయము ప్యాసింజరు బండిలో మదరాసు రప్పింపబడిరి, కడలూరు జెయిలునకు పంపబడిరి.

---

## పడవ ప్రమాదము

### ౨౫౦ మంది మహమ్మదీయ కూలిలుండిరి

### మృతినొందినవారిసంఖ్య తెలియలేదు

నాయల్ హాటీ, ఆగస్టు ౧:— శనివారము సాయంకాలము చెవషిక్ హాలు నుండి మెహ్రాచారునకు ౨౫౦ మంది మహమ్మదీయ కూలీలను తీసుకొనివెళ్ళుచున్న పడవ పోటునీటిచే ఇసుకతిన్నెను ఢీకొనెను. పడవలోనిప్రజలందరు నీటిపాలైరి రాత్రియంతయు నీటియందే తేలి బహుప్రయాసమీద కొందరు చేరువనున్న గ్రామములకు చేరిరని తెలియుచున్నది. మిగిలినవారందరు నీటిలో మునిగిపోయి మృతినొందిరి. చాల శవములు ఒడ్డునకు కొట్టుకొనివచ్చినవి. ఎంతమంది చనిపోయినది యింకను తెలియలేదు. విచారణ జరుగుచున్నది.

---

